ఓమ్.

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః



శ్రీ

# వట్టిమాయశతకము.

గంగుల నారాయణరెడ్డి విరచితము

శ్రీ శ్రీ శ్రీ గోపాలుని హనుమంతరాయశాస్త్రిగారిచే

పరిష్కృతము.

కీర్తిశేషులైన గంగుల మల్లిఖార్జునరెడ్డిగారి సతీమణియగు

రాఘులక్ష్మమ్మగారి ద్రవ్యసహాయము

1932

ఓమ్.

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః.

శ్రీ

# వట్టిమాయశతకము.

ఇయ్యది

గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకా సంతగుడిపాడు పురనివాసుడగు

గంగుల నారాయణరెడ్డి రచితము

శ్రీ॥ శ్రీ॥ శ్రీ॥ గోపాలుని హనుమంతరాయ శాస్త్రిగారిచే

పరిష్కృతము.

కీర్తిశేషులైన గంగుల మల్లిఖార్జునరెడ్డిగారి సతీమణియగు

రామలక్ష్మమ్మగారిచే [illegible]

1000 ప్రతులు

నరసరావుపేట రాజ్యరమా ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడెను.

1932

# ప్రేరక.



పాఠకమహాశయులారా, తత్త్వవిదులారా!

ఈవట్టిమాయశతకమును రచించిన కవినిగురించి యితఃపూర్వము నాచే బరిష్కృతములై 1923-1926 సంవత్సరములయందు ముద్రితములై యున్న సత్యప్రస్థానచరిత్ర సుజనమనోల్లాసము అను రెండుగ్రంథములయందుఁ బీఠికవ్రాయుటలో స్థాలీపులాకన్యాయముగ మనవిచేసికొనియుంటి, ఆవిషయమే మరల వ్రాయఁదొరకొనుట లపస్కృతమును నసంబంధమునగుట నాత్రోవనుమాని యేతద్గ్రంథమును గూర్చి విమర్శింపఁ బ్రయత్నించెద. గ్రంథనామము వట్టిమాయశతకము. అందలి విషయము తత్త్వరహస్యము అట్టి తత్త్వరహస్యము నెరుంగవలయునన్న బహువిధమము సంస్కృతభాషాపాండిత్యము నలవరచుకొనిననేగాని వేదాంతశాస్త్రపఠనమున కవకాశముకలుగదు అటులనవకాశము కలిగినను సద్గురువు నాశ్రయించి వత్సరములకొలది పంచఁగాచియుండిననేగాని విషయము సుబోధకముగాదు. అటుల సుబోధకమైనను తనంత దానానందించుటకే వలనుపడును గాని తాననుభవించెడి యానందమును బ్రపంచమునకు బంచిపెట్టుటకే మాత్రము వసతి కుదురదు. అదియు గుదురవలెనన్న జన్మాంతరవాసనాబలముననే లభ్యమగుగాని తదితరము గాదు అట్టిస్థితిలో నీశతకమును వ్రాసిన వ్యక్తి కులమున రెడ్డియయ్యు శాస్త్రవాసన నెరుంగనివాడయ్యు గవితావిషయమున నేకొలదిమాత్రపు జ్ఞానమో సంపాదించుకొనినవాడయ్యు నింత పెద్దపనికిఁ బూనుట సాహసమే, ఐనను 'దినగదినగ వేము తియ్యనుండు' అను సామెతను బురస్కరించుకొని కాబోలు తనకవిత్వము నీతొమ్మిదివత్సరములనుంచి యునేపద్యములో నేకీర్తనలో వ్రాయుచు గొంచెమభివృద్ధి జేసికొనుచున్నట్టు తోచెడిని ప్రకృతము ననుసరించెదనుగాక. ఈకవి ప్రస్తుతనివాసమగు నర్సరావుపేట కరుదెరి నాకడకీగ్రంథమునుఁ గొనితెచ్చి కనుపరచి చదివివినిపించి వెనుకటివలె బరిష్కరణమొనర్చి ముద్రణమున కనుకూలముగను శ్రోతల కానందదాయకముగను నుండులాగున జక్కపరచి శుద్ధప్రతివ్రాసి యొసంగుఁడని యనేకవిధమ్ముల వేడ నేనును వల్లెయని యొప్పికొని 28—12—31వ తేదీ యుదయమావ్యక్తి సంప్రార్థనముపై దన స్వగ్రామమగు సంతగుడిపాడునకుజని యటఁ గొంతకాల మధివసించి సవరణ బూర్తి చేసి శుద్ధప్రతి వ్రాసి 20—1—32వ తేదీ యుదయమారుగంటలకు మరల గ్రంథమునొసగితి. ఏదియెటులున్నను, కవియొక్క ప్రస్తుతతత్త్వము మాత్ర మాస్తికనాస్తిక తత్త్వములకుఁ జెందక నవీనతత్త్వమునకుఁ జెందియుండుటచే నస్మాదృశులెటుల భావించుటకును, నెటులలిఖించుటకునుఁ దోచక దూష్ణీంభావమును వహింపవలసివచ్చినది. వస్తుతస్తు కవి సాధుకోటిలో నొకఁడుగ బయలుదేర నభిలషించి తన భావము నీవిధముగ వెల్లడిచేయుచున్నాడేమోనని యనుకొనక దప్పినదికాదు. కర్మసూత్రమీ కవి నింకెన్ని తెరంగుల ద్రిప్పునో యోచనీయమును శోచనీయమును గావున ఫలాపేక్ష నభిలషింపక దనతత్త్వమున కారణముగ నొక్కమారీశుఁగ మార్చుకొని నిరాడంబర వేషముతో మెలంగుచున్న మా

గంగుల నారాయణరెడ్డిని, శ్రీపరమేశ్వరుండితోధికవృద్ధిగ రక్షించుగాత. శతకమాచంద్రార్కస్థాయిగ వెలుంగుగాక.

ఇత్థం,
20—1—32. గోపాలుని హనుమంతరాయశాస్త్రి.
శారదా నివాసమ్, ముప్పాళ్ళ.
వినుకొండ తాలూకా గుంటూరుజిల్లా.

---

ఆత్మతత్త్వపరిజ్ఞానసంపన్నులారా! ఆర్యకులపవిత్రులారా! యీవట్టిమాయశతకమును రచించిన కవి ఇంతకుమున్ను శ్రీసత్యప్రస్తునిచరిత్రను హరికథరూపముగా చెప్పి ద్వితీయము గురుశిష్యసంవాదమను సుజనమనోవిలాసంబు పద్యకావ్యము రచించి పండితపామరులకెల్ల మహోపకారమొసంగి తృతీయము ఈగ్రంథమును రచించె. ఈకవియొక్క సుగుణసంపత్తియు ఆపై ఈగ్రంథమునందు సారాంశమును ఏకోద్దియో శ్రీభగవానుడొసంగియున్నజ్ఞానమున భక్తిపూర్వకముగ వ్రాయదలచితి.

పరమకళ్యాణగుణగరిష్ఠుండును, పరమాత్మసేవితుండును, పరమఆర్యకులపవిత్రుండును, పరమపదదర్శనీయుండును, పరమసజ్జనసేవితుండును, పరమభక్తాగ్రగణ్యుండును, పరమప్రేమపూరితుండును, పరమఆనందమయుండును, పరమపవిత్రకరుణుండును, పరమశాంతిదాంతిశీలుండును, పరమసాత్త్వికఆహారప్రీతుండును, పరమభూతహితుండును, భక్తిజ్ఞానవైరాగ్యసంపన్నుండును, భక్తితత్త్వముచే ప్రకాశించువాడును, భక్తియేముక్తికిదారియని ఘంటాపథముగా బోధించుపండితుడును.

ప్రేమపూరితహృదయుండును, ప్రేమయే ఆచరించువాడును, ప్రేమచే సర్వమునెరిగిన సుధీరుడును, ప్రేమయను ఆనందమున నోలలాడువాడును, ప్రేమయే సకలంబనెడివాడును, ప్రేమచే సకలమును ప్రేమించువాడును, ప్రేమచే విచారించుతత్త్వజ్ఞుడును, ప్రేమయే మోక్షంబు, ప్రేమయే సర్వధర్మములకు మూలంబని బోధించువేత్తయు, ప్రేమమయుండగు పరమాత్మయే నిత్యంబనియు, యీకనుపడుచున్న దృశ్యంబంతయు, అనిత్యంబని జెప్పు నీతిశాలియగుటచే. "శ్లో॥ యద్భావంతద్భవతి" అనగా తనమనస్సెలాగో సర్వము అలాగేనను చందమున తా. సదాపరమాత్మధ్యానపరుండగుటచే అయ్యది శతకరూపముగా సంకల్పించె. అందునవరసములానందదాయకమై అలరుచుండె. నిక మాతాపితరులభక్తియు గురుభక్తియు, దేశభక్తియు, పతిభక్తియు, దైవభక్తియు, సమూలంబై కుప్పతెప్పలై యుప్పొంగుచుండుటయేగాక ప్రాసవచ్చినపద్యమును ప్రాసతోను, యతివచ్చినపద్యమునుయతితో నియమానుసారేణా సీశతకమును పూర్తిజేసెను. అందుప్రాసిన పద్యముల కీర్తనలుగాను మంగళహారతులుగా చదువుకొనుటకనుకూలమైయుండెను, అవి యెవ్వియన 4, 5, 9, 13, 15, 23, 29, 38, 48, 50, 55, 56, 57, 61, 63, 66, 78, 80

84, 94, 97 వ సంఖ్యగల పద్యములు, పద్యపద్యంబునాంతమున ఒక్క పరమాత్మయే తప్ప సర్వము వచ్చిపోవునదియే గాన- వట్టిమాయయని వచెప దేస్పష్టీకరించె. అలాచెప్పుట నాశ్చర్యంబా జెప్పుటస్వల్పము జేయుట కష్టంబను సంశయము మాత్రము వీరియందు కనుపడదు వీరు చెప్పుటకన్నను చేయుటే మిగులనిన నాశ్చర్యముండదు, వీరు చెప్పియుండిన మొదటిగ్రంథము మాతాపితరులభక్తియు, గురుభక్తియు, దైవభక్తియు, పతిభక్తియు, గలిగి సంసారమున ఇట్టినీతిచే మెలంగుమని బోధించె. నిక ద్వితీయము. సంసారంబన ఇట్టిది, నీవన ఇట్టివాడవు, ఈరెంటిమధ్య కీలునుగని మెలంగిన జాలునని సద్గురుమాట్కి బోధించె. ఇకను తృతీయమగు ఈగ్రంథము నేతి నేతి యను మహావాక్యము సరణి. అనగా, ఇదిగా దిదిగాదని తుదకు నిర్విశేషమగు ఒక్క పరమాత్మయే తప్పక నిలచియుండునని నిలువంబడెను.

యింతకుమున్ను ఈకవివంశములో జన్మించి సాధుమూర్తియై, లోకహితార్థియై, ఆర్యశిఖామణియై ఆత్మతత్వ పండితుండై, సర్వసంగ వర్జితుండై, యోగివరుల కీశ్వరుండై, మహామహుండై, వెలయు శ్రీవేమనాచార్యులు చెప్పియుండిన పద్యములరీతిని వీరును చెప్పియుండిరి. చెప్పుటయందేమి చేయుటయందును శ్రీ వేమారెడ్డిగారితో యీ నారాయణరెడ్డిగారు సమానులనిన లోకసమ్మతమైయుండును.

“శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య। మామేకం శరణంవ్రజ” అని శ్రీభగవానుడానతిచ్చినట్టివడి అనగా సర్వధర్మములొదలి నన్నే శరణుబొందిన నిన్ను తప్పక రక్షించెదనని ఆజ్ఞయిచ్చు సరణి ఈగ్రంథము అవిశ్వాసమునులేక ఒకేవిధముగా సర్వధా భగవానుడే రక్షకుని దృఢముగా జెప్పుచుండె. యిట్టిగ్రంథము నచ్చొత్తింపజేసి ద్రవ్యసహాయమొనరించి మహోపకారమొసగియున్న శ్రీ వంగోలు పాపిరెడ్డి సుబ్బమ్మగార్ల సుపుత్రియై శ్రీఆర్యమిత్రమండలి సభజేరి అహింసాది ధర్మంబుల నాచరించుచు, కీర్తిశేషులైన, గంగుల మల్లిఖార్జున రెడ్డిగారి సతీమణియగు రామలక్ష్మమ్మగారికి శ్రీసీతారామచంద్రప్రభువు యీలాటి లోకోపకారమగు బుద్ధిని గలుగజేయుచు అంత్యదశయందు సాయుజ్యపదవి నొసంగుగాక.

ఈగ్రంథకర్తయగు కవి మనమందేమరక శ్రీపరమాత్మ నివశించుగాక. పదే పదే యీలాటి గ్రంథములు వ్రాసి దేశము నుద్ధరింతురుగాకయని శ్రీ పరమాత్మున కనేక ప్రణామములు జేయుచు ఇంతట విరమించుచున్నాడను.

సంతగుడిపాడు
ది6–2–32.

ఇట్లు విధేయుడు,
తోకచిచ్చు వెంకటప్పలరాజు.



శ్రీసద్గురు రంగేశ్వరాయనమః.

నిత్యానంద మోక్షసౌభాగ్య సంతులారా! సితికోవిదులారా!

శా॥ శ్రీరమ్యంబగు బ్రహ్మ మెద్దియని నే • శోధించుచుగా నార్యులన్
ధీరత్వంబెడ బాసిభక్తి నడుగన్ • దివ్యంబుగా వారలున్
ఓరీ బ్రహ్మము చూడబట్ట బయలం • చొప్పించి బోధించగన్
ధారాళంబుగ సర్వరూపములకున్ • దాసోహమున్ జేసెదన్॥

ఉ॥ వట్టిది మాయలోకమని • వాంఛలుద్రుంచియు నిత్యభక్తితో
బట్టబయల్ నిజంబుయని • బాగుగగ్రంథము యుక్తితోడుతన్
వట్టుగ వ్రాసితీవు భువి • భక్తులుడప్పక సంశయంబనే
గట్టునుదాటి మోక్షమును • గ్రన్ననజెందుదు రిట్టిబోధచే॥

చ॥ కదలక వట్టిమాయ శత • కంబునుఁజిన్నను కర్మజాలముల్
వదలును సద్గుణంబులిక • వద్దకుజేరును మానవాళికి
న్నిదినిజమంచు నార్యవరు • లింపుగబోధలు జేతురంచునే
మదినిదలంతు నీశ్వరుని • మానకనిత్యము భక్తితోడుతన్॥

మ॥ శతకమ్మింటిని సంతసించితిని నీ • శాంతంబు నే గాంచితిన్
మతముల్ భావము మార్గమార్పులని నీ • మాటల్ వినన్ దోచె యీ
హితవుల్ నెంచగ నిర్మలుండవని నే • నింపొందితిన్ బాలకా
నతిచిత్రింబగు నీదుచేష్ట గనగన్ • యానంద సంప్రాప్తమా॥

సీ॥ బాగుగాభువి రెడ్డి • వంశమందుఁనబుట్టి
వాసిని గైకొన్న • వరగుణాఢ్య
గంగులవారింట • ఘనకీర్తి జెందిన
నారాయణుండవు • నయగుణాఢ్య
గురుగోప్యమునుగన్న • గుణకులలోమేటి
కరుణను పడసిన • స్థిరగుణాఢ్య
విధి నిషేధంబులు • వేడ్కతో నెంచని
సుగుణుండ వగుదువో • సురగుణాఢ్య

తే॥ గీ॥ నీకు సంపూర్ణజ్ఞానంబు • నిలచుకొరకు
పరమగురుమూర్తి నేవేళ • భావమందు
నిల్పి సేవింపుచుందును • నియతితోడ
అన్యభావంబులేకుండ • నతిగుణుండ॥

అన్నవరం.
24-3-32.

ఇట్లు
సద్గురు విధేయుఁడు,
వాలిచర్ల హనుమయ్య.



# ఓం.

శ్రీ స ద్గు రు ప ర బ్ర హ్మ ణే న మః.

# వ ట్టి మా య శ త క ము.

సీ॥ శ్రీశివరూపుఁడై చెన్నొందుహనుమయగురునాశ్రయింతు నేకోర్కిఁ బోక
తమంగాట్లలోకమాతయుఁ గాంచుభక్తులబహుగఁ బూజింతు నేభ్రాంతిఁ బోక
సకలజీవులకును సాష్టాంగముగఁ బడి దాసోహమందునే దారిఁ బోక
చక్కఁగా శతకంబు సంపూర్తిగాఁగ సద్బుధులఁ గొల్తునే వేరుఁ బోక
తే॥ గీ॥ పలుకుపలుకునఁ దప్పులే పట్టఁ బోక
అర్థమాత్రనిరర్థమాచనఁగఁ బోక
నిజముబద్ధాలెఱుంగక నెగ్గఁ బోక
నుడివిదితరజనము సన్నోముఁగాక॥ 1

సీ॥ జగతికాధారమ్ము సత్యమాచనిసమ్మి తేటగాదానినిఁ దెలియ లెస్స
కలధనంబులనెల్ల జ్ఞానమే హెచ్చని తేటగాదానినిఁ దెలియ లెస్స
ధర్మతత్వమ్ములదయమిక్కుటంబని తేటగాదానినిఁ దెలియ లెస్స
ఓరిమిగుణముల నుత్తమగుణమని తేటగాదానినిఁ దెలియ లెస్స
తే॥ గీ॥ నిత్యమాగళవస్తువుఁ దెలియ లెస్స
తేటలోఁ దేటమనసుచేఁ దెలియ లెస్స
తెప్పకొయ్యనుఁగొనియీదఁ దెలియ లెస్స
బట్టబయలొక్కటేతప్ప వట్టిమాయ॥ 2

సీ॥ కావ్యసమ్మతమైనఁగానిదేదియు లేదు కోరినచదువందు కొంతమంది
శాస్త్రసమ్మతమైనచదువు లేనిది లేదుగురుమూర్తికృపయందు కొంతమంది
వేదసమ్మతమైనవేరుమోక్షము లేదు కూడినపనియందు కొంతమంది
యుపనిషన్మతమైననోగిబంధమే లేదు గుణరహితంబందు కొంతమంది
కొత్తపద్ధతినలదందు కొంతమంది
గురుతుముఖ్యమటందురు కొంతమంది
గురునిసేవయెసుఖమందు కొంతమంది ॥బ॥ 3

సీ॥ విష్ణువే దైవంబు విష్ణువే ఘనుఁడని యెన్నుచు వైష్ణవులన్న మాట
శివుఁడె దేవుండని శివలోకమిదియని యెన్నిమారులొ శైవులన్న మాట
శివకేశవులు వేరె వివరింపగానని మున్నుగా సామాన్యులన్న మాట
శక్తియే జగతి చిచ్ఛక్తిమూలంబని పన్నుగా శాక్తేయులన్న మాట
దేవుఁడెక్కడనున్నాఁడు దేవులాట
నిన్నుఁగననీవు నీవుగానున్న మాట
ఇన్నిమాటలఁబల్కులే సన్నమాట ॥ బ ॥ 4 [వలుకు

సీ॥ బ్రహ్మకుముఖమందు బ్రహ్మవర్యులు పుట్టుక్రమమిదెయనుచు వేదములు
భుజముల రాజులు భుజబలులై పుట్టుక్రమమిదెయనుచు వేదములువలుకు
నూరుస్థలమునందు భూరివైశ్యులు పుట్టుక్రమమిదెయనుచు వేదములువలుకు
పదములశూద్రులు తుదకుఁబుట్టిన పుట్టుక్రమమిదెయనుచు వేదములువలుకు
ఎంచిచూరు శాస్త్రములిలఁ బెంచిపలుకు
తమనుఁదామెరుఁగని పురాణముల పలుకు
అలుకువిడి యహంకారమే పలుకొ పలుకు ॥బ॥ 5

సీ॥ మతముల హైందవమతమెముఖ్యమటంచు ప్రతిసారి హిందువుల్ పలుకుచుం
ప్రేమమైమామతంబె పెద్దదియటంచుఁబట్టున మ్లేచ్ఛులు పలుకుచుంద్రు [ద్రు
కలమతంబులలోనఁ గ్రైస్తవమతమె సేవ్యంబంచుఁ గ్రైస్తవుల్ పలుకుచుంద్రు
యుపకారమునకిదే యొప్పెడుమతమని బౌద్ధమతార్యులు పలుకుచుంద్రు
మతములన్నిట సమ్మతి మంచిదంచు
బలముగల్గిన వారలు పలుకుచుంద్రు
మతము గీతమని రెటమతమనుబాలంద్రు॥ 6

సీ॥ విగ్రహారాధనా విషయమెక్కడు మోక్ష తత్వమంచందురు దానివారు
నిర్గుణబ్రహ్మము నిజముగా వేడినఁ దరుగు లేదందురు దానివారు
అదిగాదు దేశంబు నాదరించుట మంచి దశయటంచందురు దానివారు
ధనమున్న సకలంబు దానిలోఁ గలదని తరిమి చెప్పుదురెంతొ దానివారు
భార్యలేకను సుఖమునువడయలేరు
దారిదానికిదియ యంద్రు దానివారు
తరుణిసంటుటఁ దగదంద్రు దానివారు ॥ బ ॥ 7

సీ॥ తల్లిదండ్రులసేవ దైవసేవయటంచు గుఱుతోడసందురుకొంతమంది
అన్నదానముఁ జేయనంతె చాలునటంచుఁ జక్కఁగానందురుచాలమంది
పెద్దలసేవింపఁ బెరటివృక్షముమోక్ష మిదెమంచిదండ్రుమఱింతమంది
తీర్థయాత్రలనన్నితిరుఁగఁ బుణ్యం బెంతొ యేమిచెప్పఁదుమ-దురెంతొమంది
ఇచ్చు ఫలముపవాసమం చెచ్చుమంది
సఁబురాణముసుఖమని వేలమంది
యెందులకివిగుణమని రొక్కంతమంది ॥ బ ॥ 8

సీ॥ అదెపుట్టునదెపోవుగదమన కేటికి యెంచుటఁబని లేదుమంచికొఱకు
పుట్టినందులకట్టిచట్టముల్ వడలక నుంచవలెమనసుమంచికొఱకు
యెవరికెట్టులఁ బెట్టునవనిలో దేవుఁడు మించఁబోదట్టనిమంచికొఱకు
యుత్తమౌమాటలునుత్తమౌమాటలే త్రెంచవాబంధముల్ మంచికొఱకు
యెంచమానమెమంచిదౌ మంచికొఱకు
మంచికామంచియందురు మంచికొఱకు
పెంచియీరీతియుంటినా మంచికొఱకు ॥ బ ॥ 9

సీ॥ సత్తునుండియెసృష్టిసాగివచ్చినదంచునాదిపల్కెనొకొక్కయుపనిషత్తు
అదిగానిదేదీనికాదికారణమంచు నొప్పుగానను నొకయుపనిషత్తు
మొదటసత్తైయుండిమొలచెసత్తుగదానియునికియేయను నొకయుపనిషత్తు
సృష్టికిమూలముసృష్టియేయంచును నుత్తర్దఱ వేరొక్కయుపనిషత్తు
పయిగననికొంతశాస్త్రము పలుకునెత్తు
గ్రించెయనియద్దియేతిరిగియనుఁజత్తు
చివరభగవంతుఁడొకడని చెలగియెత్తు ॥ బ ॥ 10

సీ॥ అండమందున జీవులవతరించుటఁ గొన్ని పాలులేకనుఁ బెర్గు బాగుగాను
స్వేదమందునఁ గొన్ని స్వేచ్ఛమైఁ బుట్టుటఁ దల్లిలేకనుఁ బెర్గుదరుచుగాను
మావియందునఁ గొన్ని మహిమగాఁ బుట్టుటఁ దల్లిపాలనుఁ బెర్గుఁ దండిగాను
యుద్భిజ్జముగ నేలనూరకఁ బుట్టుటఁ జలనము లేకుండుఁ జల్లగాను
గగనచరజలచరములై కాంచఁగాను
భూమిచరులునచరలుగఁ బొందలఁగాను
దేవుడందురువీటినిఁ దేలఁగాను ॥ బ ॥ 11

సీ॥ ఆధారచక్రంబునారయగుదమందు గణపతియచ్చటఁగారకుండు
స్వాధిష్టచక్రంబుస్వయముగాగుహ్యము బ్రహ్మదానికిఁజూడఁబాలకుండు
మణిపూరకంబికమనునాభియందున నారాయణుండటనాయకుండు
హృదయకంజముఁజూడ హెచ్చైయనాహతమ్మునఁనీశుఁడధిపుఁడై పొదలు [చుండు
కంఠమందువిశుద్ధము గ్రాలుచుండు
బొమలసందున నాగ్నేయముతలనుండు
దాసహస్రారమంచుశాస్త్రముననుండు ॥ బ ॥ 12

సీ॥ అన్నమయమెబ్రహ్మఁగన్నవారికినంచు సమ్మతిఁజెప్పువేదమ్ముకొంత
బ్రహ్మమనోమయబ్రహ్మమనితిరిగి సమ్మెనొనర్చువేదమ్ముకొంత
ప్రాణమేబ్రహ్మమాప్రాణిఁగానఁడటంచు నమ్మించిచెప్పువేదమ్ముకొంత
విజ్ఞానమయబ్రహ్మమజ్ఞానమునడంచి నెమ్మిమెఁజెప్పువేదమ్ముకొంత
సూటియానందమయబ్రహ్మకోటియంత
యనుచుదలవంచెవేదంబువెనుకఁగొంత
నిన్నుఁగానఁగఁబలుకలేసున్నవింత ॥ బ ॥ 13

సీ॥ ఖేచరిఁజూచినఁగేశవుండగుపడు నయ్యాలారామనక నెడివారు
భూచరిఁజూచినప్పుడెహరికనుపడు నమ్మలారామనక నెడివారు
శాంభవిఁజూచినశంభుండుప్రత్యక్ష మానయ్యమనకింకన నెడివారు
షణ్ముఖిఁజూచినఁజక్కనిత్రోవమ్ము ముక్తినిఁగొనుఁడనిముంచువారు
మధ్యనుంజూచుగడియలో మాయపోరు
నిద్రనలదని పాఠముల్ నేర్పువారు
ముద్రలకఁ పేడుమనెదరు ముసలవారు ॥ బ ॥ 14

సీ॥ అండమేగ్రుడ్డనిపిండంబెకళయని యొప్పుగాగురువులుచెప్పిచూపి
బ్రహ్మాండమేచూపుబ్రహ్మాండమంతనునిన్నుఁగాఁజెప్పుచునన్నుఁజూపి
తెల్లగానున్నది నల్లగానున్నది గంగయమునలంచురంగుఁజూపి
యందుసరస్వతిబిందువేచూడంగ తీర్థముల్ వలదనివార్థిఁజూపి
చిత్తునకుమూలమైనయా సత్తుఁజూపి
సచ్చిదానందవేధఘుఁ దెచ్చిజూపి
భవములేదందు రెవరికిజీవరకాపి ॥ బ ॥

సీ॥ కంటిలో నెఱ్ఱఁగఁగనుపడుచున్నదే బ్రహ్మరా శిష్యుఁడ బాగఁజూడు
నల్లగ్రుడ్డనుఁ జుట్టు నమ్మరా విష్ణువుకల్ల లేకనుసుంతఁగలయఁజూడు
మరియున్న వర్ణంబు మానాథుఁడెరుగరా వెదుక నేలను నీవు వేరెచూడు
ఎఱఁగనివారలీరెచటనోకలరని చెప్పుచుండెద రెంతో చింతఁజూడు
మూర్తులుమువ్వురునీవుగాఁ బోల్చిచూడు
మంతకుమిగులు లేదు విశ్వంతమూడు
బ్రదుకుఁ బెరువను గురునిఁ బో బ్రతిమలాడు ॥ బ ॥ 16

సీ॥ ఆకాశమునవాయువవతారమెత్తె నావాయువునకునగ్నిపరగఁబుట్టె
నగ్నిచేజలమయ్యె నాజలమునభూమిభువికిఁగర్మేంద్రియంబులునుఁబుట్టె
నటుపైనిజలమునకాదిలోఁజూడఁగ విషయేంద్రియంబులు వేడ్కఁబుట్టె
జ్ఞానేంద్రియంబులుకలిగెనయ్యగ్నికి వాతావరణముట్టిపడుచుఁబుట్టె
పంచప్రాణంబులవియెగాఁ [illegible]యట్టె
సాకలోనింద్రియాదులఁజంకఁబెట్టె
నాశతో శాస్త్రములఁగాంచనంతచుట్టె ॥ బ ॥ 17

సీ॥ యమనియమములయందవని వత్సరమున్నఁదఱఁగనిపదవికిదారిఁ జూపు
భూరిప్రాణాయామమున నెల రారున్న బ్రహ్మపురికిఁ జేరుబాటఁజూపు
బూనిప్రత్యాహారమున మూడు నెలలున్న భావంబునకుమంచిపదవిజూపు
ధ్యానంబుఁదప్పక దపమాచరించిన మూడుపక్షములందుముక్తిఁజూపు
ధారణకుఁబాలుఁబక్షముతననుఁజూపు
మనసమావేళనేకపుమహిమఁజూపు
మానసమాధియెఘనమనువ్యాసమాపు ॥ బ । 18

సీ॥ తూర్పునునింద్రుండుదొరయయిపాలించునింద్రలోకమొకటియుంపుగలదు
దక్షిణదిక్కునధర్మరాజేలెడు శమనలోకంబదే చక్కఁగలదు
పడమరన్ వరుణుండుపటుధృతిఁగాపాడువరుణలోకంబునావరుసఁగలదు
యుత్తరానఁగుబేరుఁడొగిరాజగానుండు యక్షలోకంబదియవినఁగలదు
ఈశుకైలాసమామూల నెంచఁగలదు
అగ్నినైఋతి పవనునకందుగలద
టంచుసకలపురాణమ్ములందుగలదు ॥ బ ॥ 19

సీ॥ అటు నేఁడు నిటు నేడు నైన లోకము లెన్ని గుణియింపు మని చెప్పి కొంత చూపు
పైన స్వర్గమ్మును బదఁపడి మానవ పాతాళలోకముల్ ప్రతిభఁ జూపు
తరణిలోకంబు సుధాంశులోకంబని పాలుమాలకఁ జెప్పి బహుగఁ జూపు
నక్షత్రలోకంబు నాణెమై యున్న ది ధ్రువలోకమ దెయని దూరి చూపు
లోక సముదాయ మెల్లను లోని చూపు
కొంతఁ జూచిన నీవేసిఁ గొంత చూపు
పలుకు నైదు వేదమ్ముల పలుకు నాకు ॥ బ ॥ 20

సీ॥ ప్రతిని మేషము వేద పారాయణము జేయ బ్రహ్మయజ్ఞంబ దే భవ్యులార
అగ్ని నాజ్యముఁ బోసి యర్చింతురే వేళ దేవయజ్ఞంబ దే ధీరులార
పితృదేవతలకతి ప్రియముతోఁ బెట్టినఁ బితృయజ్ఞ మయ్యదే వేత్తలార
అతిథికి నాహార మడిగినప్పుడొసంగ నతిథియజ్ఞంబ దే యయ్యలార
భూతములకు బలుల వెట్టఁ బూజ్యులార
యజ్ఞ పంచక సంస్కారి యగును కోరఁ
విషయ మెఱిఁగి చరింపుఁడీ విబుధులార ॥ బ ॥ 21

సీ॥ అశ్వమేధముఁ జేయ విశ్వము స్వర్గంబుఁ దరుఁగ నియశమని తిరిగి తిరిగి
మేక యజ్ఞ మొనర్ప లోకముల్ జూపించుఁ దరుఁగ నిసుఖమని తిరిగి తిరిగి
రాజసూయముఁ జేయఁ దేజ మంతటఁ గల్గుఁ దరుఁగ నిముదమని తిరిగి తిరిగి
క్షమ దోసకాయ యజ్ఞము బహుపుణ్యము తరుఁగని ఫలమని తిరిగి తిరిగి
నరులకును నరులు వ్రాసిరఁ దిరిగి దిరిగి
యెఱిగి చేసిరి కొందరు తిరిగి తిరిగి
నరుఁడు నారాయణుండని దరికిఁ దిరిగి ॥ బ ॥ 22

సీ॥ గజముఖునకు గుడిఁ గల్పించి సేవింప మేదిని యీజన్మ మేలు మేలు
హనుమంతు దేవాలయమ్ముఁ గట్టింప మీదట జన్మంబు మేలు మేలు
గోపాలమూర్తికి గోపురాల్ గట్టింప మిక్కిలి జన్మంబు మేలు మేలు
శివునకు నిత్యాభిషేకముల్ బొనరింప మించనీ జన్మంబు మేలు మేలు
రామునకు ధ్వజము నెత్తించ లావు మేలు
ఆదిశేషునిఁ గొల్వగా నతిగ మేలు
నిజము నీ మేలు నా మేలు నిద్ర మేలు ॥ బ ॥ 23

సీ॥ పోలేరునెత్తినఁబోయనీళ్లే తేలు బోనమ్మఁదినఁబెట్టభూమిపండు
నంకమ్మతిరునాళ్లనతిసంభ్రమునఁజేయఁ దరుగులేకుండఁబాతర్లునిండు
నద్దంకికానందమానటుల్ పసపును బూసినకఁడియుముదురుపండు
మహాలక్ష్మికెప్పుడుమానకవడపప్పుఁ బానకాల్ చేసినఁబ్రత్తిపండు
ఘనతశ్రీకూనలమఁగొల్వఁ గడుపుపండు
నుప్పులమ్మనువేడిన నుప్పఁబండు
పంనుపండనిపండిలఁబండకుండు ॥ బ ॥ 24

సీ॥ చచ్చినవారికిసమాధియనికట్టి వరుసనుబూజింత్రువారివారు
గోరీగఁగొందరుగోపురమ్మేర్పఱ్చి పూజింపుచుందురుపూనికవారు
తులసికోటగఁగట్టితోటగాఁగావించి కోరిపూజింతురుకులమువారు
బొమ్మగాఁజేయించిబొందపైశిలనుంచి యురుభక్తిఁబూజించుచుంద్రువారు
పాయిగురుతుగ శాసనాల్ వ్రాయువారు
నాగకెముననుఁ మెచ్చినాటువారుఁ
గిట్టిలకఁగాల్తుమనువారు కడకులేరు ॥ బ ॥ 25

సీ॥ బ్రహ్మచర్యమెముక్తిబాటకుమొనగాఁడు మాటతొల్గకరఁడిమాయగాదు
రాజయోగమెముక్తిరమణిసంగంబని సాటిచెప్పుదురెంతొచక్కఁగాదు
మించదానపరిష్ఠమెంచశక్యమెముక్తి మహిమవినుఁడికసంబరముఁగాదు
సన్యాసమునఁగానిసాధింపలేమంద్రు ముక్తికింకొకయుక్తిమొదలుగాదు
వారువారలపుస్తకాల్ వ్రాసినీదు
తెలివితేటలుగన్నారు తిరుగఁగాదు
నీటుమైతిర్గుటదియొకనిరతిగాదు ॥ బ ॥ 26

సీ॥ వైకుంఠమేమహావైకుంఠమందుమాయొక్కశ్రీహరికిందనున్నదాయె
కైలాసమేమహాకైలాసమందుమా భుజగభూషణునాజ్ఞఁబొందుటాయె
సత్యలోకమెమహాసత్యమేయందుమా బ్రహ్మపత్తనమనిపలుకుటాయె
గోలోకమేమహాగోలోకమందుమా పదుగురిచేతిలోఁబడినదాయె
స్వర్గమేమనినింద్రునిస్వంతమాయె
యీతనువెయనియంచ మాయెరుకదాయె
మరలసుఖమసనేటిలోఁ సామాన్యమాయె ॥ బ ॥ 27

సీ॥ కోటివిద్దెలునైనఁ గోండ్రకుఁదచ్చుని మేలుబల్కెడువారిమీరఁగలరు
చదువుమూఁడవకన్ను చదువు శ్రేష్ఠంబని మేలుబల్కెడువారిమీరఁగలరు
చదువుగాదది తెల్విచదువెయెక్కువయని మేలుబల్కెడువారిమీరఁగలరు
విద్యలన్నిటిబ్రహ్మవిద్యమంచిదియని మేలుబల్కెడువారిమీరఁగలరు
మేలుడబ్బనదానినిమీరఁగలరు
మీరెధీరులమనువారిమీరఁగలరు
మేలుసేరీతినంతటమీరగలరు ॥ బ ॥ 28

సీ॥ అడ్డబొట్టే పెట్టదొడ్డముక్తియటంచుఁ గానరామీరనిదానివారు
నిలువుబొట్టేయమున్నిలువఁబెట్టునటంచు నానదామీకనిదీనివారు
చుక్కబొట్టునబమ్మచిక్కడామాకిక మానుడీవాదముదానివారు
చుట్టుకొల్లాపురిబొట్టుమంచిగనుండు దానిసుఖంబనిదీనివారు
మాసితముగంగిబొట్టనిదానివారు
పోనివిదిబొమలబొట్టనిదీనివారు
లేనివారలుబొట్టులే లేనివారు ॥ బ ॥ 29

సీ॥ బొమ్మలాటకుసరిబొమ్మలాటేసుమాఁ యనుచుగొంతజనమ్ములనుచునుండ
వీధినాటకమంతవింతగాఫలమిచ్చునది లేదనుచు గొందరనుచునుండ
పలునాటిసుద్దులపాటిగాథలుజగమ్మందు లేవనికొందరనుచునుండ
హరికథవినుచుబ్రహ్మానందముల్ జెందిహాయిహాయనికొందరనుచునుండ
బంతులాటలుసతముగన్పట్టుచుండ
గొసరిగారడివిద్యనేగోరుచుండ
నిలచునిజవస్తువునుఁగాంచునిరతినుండ ॥ బ ॥ 30

సీ॥ రంగులలో నెఱ్ఱరంగె శ్రేష్ఠంబుగఁజూడగా జగతినిఁజూపుజనము
నల్లరంగేమంచినాణ్యమంచనియెంచిచూడగాఁ జగతినిఁచూపుజనము
పచ్చరంగుల్ మదిభావించిభ్రాంతితోఁజూడగా జగతినిఁజూపుజనము
తెల్లరంగేరంగు తేలగాననియుక్తిఁజూడగా జగతినిజూపుజనము
ఆకుపచ్చకుమిగులు లేద నెడిజనము
అంద మేదనిరంగులనాడుజనము
తిరిగిచెప్పుటనాకెంతతిక్కఁదనము ॥ బ ॥ 3

సీ॥ భగవంతుఁడిట్లుగఁ బరిణమించెనటంచు నద్వైతసిద్ధాంత మంత చెప్ప
భగవంతుఁడట్లులఁ బరిణమించునుజీవ సిద్ధినా ద్వైతులు స్థిరతఁ జెప్ప
భగవంతునకుమాకు భ్రాంతియడ్డంబని శ్రీవిశిష్టాద్వైతి చేరి చెప్ప
భగవంతుఁడనశాంతభావమేయనిమాధ్వసిద్ధాంతమొక వైపు చెలగి చెప్ప
భూరికర్మయ యుదియని బుధులు చెప్ప
గాదు లేదని యెన్నియో కథలు చెప్ప
నిక్కమెంచిన స్వప్నమే నిజముతప్ప॥ బ॥ 32

సీ॥ ధనముఁగల్గిన నెన్న ధనముతో సాటేది యున్నదని ధరణిమున్నుఁ గనఁగ
గుణముతోడ నెకల్గునణిమాదిసిద్ధులు దీనికిసమముగావానిఁ గనఁగ
నాత్మబలములేక నాత్మనుఁగనుటకు చేనికిగాదనిలోనఁ గనఁగ
సాంగత్యమునఁగాని సంగతిలేదుగా ఫలముదానికిసమమిలనుఁ గనఁగ
గష్టమునఁగాని దేదియుఁ గష్టమనఁగ
నెంతఁజచ్చినఁ నంతియే చింతఁ గనఁగ
నింతయేటికిఁ గనులఁగానింతఁ గనఁగ ॥ బ ॥ 33

సీ॥ రుచులలోఁదీపియేరుచియటంచనుజిహ్వదానిఁదెమ్మనువారుధరణిఁగలరు
చేదులేనిదిరుచిచెడ్డగానుండునుతిరిగితెమ్మనువారుఁ దిరుగఁగలరు
వగరులేనిదిరుచి బాగుబాగనియంచు దాని మెచ్చెడివారుధరణిఁగలరు
యుప్పులేనిదియెంతయున్ననురుచిలేదు తెప్పించుమనువారుతిరుగఁగలరు
పులుసురుచియనువారలు భువినిఁగలరు
కారమునురుచియనువారుఁగలరుకలరు
ప్రాణమొనరికీరుచిగాన బ్రతుకఁగలరు ॥ బ ॥ 34

సీ॥ భూమిశాశ్వతమనిపోదికెన్నటికిని యొక్కఁడేయిదియని యొక్కరొకరు
ధనముశాశ్వతమనిదాచియుంచెదమనియొప్పుగానిదియనియొక్కరొకరు
కీర్తిశాశ్వతమనికృతిచెడఁబోదని యుత్త దంతయునని యొక్కరొకరు
గురుడశాశ్వతమనిగురినిల్పవలెనని యుత్తమంబిదెయని యొక్కరొకరు
యోర్పుశాశ్వతమనియందురొక్కరొకరు
యొక్కటిసతముకాదనియొక్కరొకరు
యొజ్జలీరీతిఁ జెప్పిరియొక్కరొకరు ॥ బ ॥

సీ॥ ఆదాయముల పెద్దయమ్ముఁటఁ గొనుట యేయంతకంటెనుఁ జూడమసఁగవిందు
భూమికంటెని కెందుఁ బొలుపారడని తొలి యాదాయమే యనియనఁగవిం
గోవుల మేపిన గొప్పలాభము ధాత్రినంతకుమిగు లేదియనఁగవిందు [దు
మేకలసాకఁగ మేలు లాభము వచ్చునౌనె దీనికిసాటియనగఁవిందు
గొర్రెలంతకుఁ బొదినాఁ గూడవిందు
కోడితో సాటి లేదని కోరవిందు
పాడిఁ దప్పిన లాభమే పరగనిందు ॥ బ ॥ 36

సీ॥ కంపపుల్లలగూటఁ గష్టమేమియు లేకఁ జిరతరంబుగఁ బెర్గు జీవులెన్నొ;
మట్టియందునఁ బుట్టి మట్టియే తినబట్టి చిరతరంబుగఁ బెర్గు జీవులెన్నొ;
నీటిలో నేపుట్టక నీటిలో నేచిట్టక చిరతరంబుగ బెర్గుఁ జీవులెన్నొ;
మేఘలందునఁ నున్కి మేటియొయ్యాలలందుఁ జిరతరంబుగఁ బెర్గు జీవులెన్నొ
చింతఁ జూడఁగఁ బొటలోఁ జీవులెన్నొ;
చీము దోమలుగా వచ్చు జీవులెన్నొ;
పాపపొట్టకుఁ జేసెడి పాటులెన్నొ; ॥ బ ॥ 37

సీ॥ తిరుపతి వేంకటేశ్వరుఁ జూడఁ బోయినఁ జాలని కొందరీలీలనండ్రు
పండరీపురమున రంగనిఁ జూడఁ జాలని కొందరీలీలనండ్రు
భద్రాద్రినగరిన భద్రేశుఁ జూచినఁ జాలని కొందరీలీలనండ్రు
కోటయ్యతిరునాళ్ల కూటముఁ జూచినఁ జాలని కొందరీలీలనండ్రు
భక్తికబ్బయ్య నీక్షింపముక్తియండ్రు
బిలము పల్లయ్యగాంచిన భక్తిరెయండ్రు
పలసిగోలమసకని మేలుగండ్రు ॥ బ ॥ 38

సీ॥ సాలోక్యపదవిని సాటిచెప్పుచునుంత సత్యముగా గనినెంతు సరగవినిన
సామీప్యపదవినిఁ జక్కఁగా వినుమనినిత్యముఁ గన నెంతు నిబ్బరమున
సారూప్యపదవినిఁ జాలఁ గ్రహించిన సరసులకని యెంతు సంబరమున
సాయుజ్యపదవిశశ్వన్మోక్షదంబౌటఁ దబ్బరయని యెంతు తక్షణమున
సగుణమని యెంతు రిచ్ఛావిధమున
నిర్గుణమ్మని యూరించినీలఁగనిన
నుండియున్నిటిఁ బిలచునీయుక్తిఁ గొనిన ॥ బ॥ 39

సీ॥ తామరాకునసీరుతగిలియున్నవిధంబుఁదగులుముసంసారధర్మమందు
బురదలోఁగుమ్మరపుర్వుపోయినచాలుఁబోవ్రముసంసారమోహమందు
గాలివానిసణిఁగోర్కెలేమియులేకఁజరియింపుసంసారచక్రమందు
గ్రామకరణముపోల్కిఁగనుఁగొనియానీతిమెలగుముసంసారమిషకుముందు
భారమికలేదటంచుఁగష్టమొందు
డిగినతరువాయిఁదెలియును ద్వైత్యమొందు
ననుచుఁజెప్పెడివేదాంతమందుడిందు॥ బ॥ 40 [డు

సీ॥ అన్నవస్త్రములేకసరచుచుండునొకఁడు పాలుపెరుగునుఁగూర్చిపలుకునొకఁ
భూమిబత్తెములేకపోయెనని మొకండుముఱుఁగులగొలుసులకుఱియునొకఁడు
నిల్వనీడయులేక నీడఁగోరునొకండు నుయ్యాలకైయూగు చుండునొకఁడు
ఒకఁడదిమ్మిడికోరకొక్కఁడొకండు నూరురూప్యములని నుడుపునొకఁడు
వేయిఁగోరునొక్కఁడు వేలనొకఁడు
లక్షకధికారిగాఁగోరులక్షనొకఁడు
కోటిమాట్టసముందని కోరునొకఁడు॥ బ॥ 41

సీ॥ సంతానమేలేక సంతాపపడువారు సంతానమెక్కుడై చచ్చువారు
విద్యమాకేదని విధినిందిట్టెడువారు విద్యయేటికటంచు విసుగువారు
బలముమాకెట్లని పట్టుఁబట్టెడివారు బలమెందులకటంచుఁ బలుకువారు
ధనముమాకెటువచ్చుఁగాసింతయనువారు ధనమదెందులకంచుఁగసరు
పంపుకొనినసద్రి రాదని పడెడువారు (వారు
తిరుగుచుండిన నిద్రనాఁ దిట్టువారు
ఆకలేటికిలేదని యడుగువారు॥ బ॥ 42

సీ॥ గురుఁడనునేనని గురుతుఁజూపెదనని డబ్బులేదనిముందు డబ్బునడుగు
జ్యోతిష్కుఁడను నేనుశుభమువ్రాసెదనని డబ్బులేదనిముందు డబ్బునడుగు
వైద్యుఁడనేనని వచ్చిడంబముఁజూపి డబ్బులేదనిముందు డబ్బునడుగు
వ్యాజ్యముఁగెలిపింతుననిలంచగొండితా డబ్బులేదనిముందు డబ్బునడుగు
డబ్బులేదనుచు డలారి డబ్బునడుగు
డబ్బులేదని స్వామికి డబ్బునడుగు
జేరియీరీతి దేనికై చెప్పనడుగు॥ బ॥ 43

సీ॥ దేవుఁడేమనలనుఁ దెప్పించెనిట్లని చెప్పుమరొక్కరు చేతఁజూచి
దేవుఁడు తెచ్చునా తెల్వితక్కువయని పలుకుదురొక్కరు పారఁజూచి
వచ్చిపోవుచునుండునైనమేమిమనకుఁ దెలియుఁడను నొకండు తేరఁజూచి
రాలేదుపోలేదు రాదికఁబోదిక నిజమనునొక్కండు నియతిఁజూచి
తినుటకె మనమనునొకఁడు తిరిగిచూచి
తిన్నసుఖమెయను నొకఁడు తివిరిచూచి
జగతిఁబదిమాదిరియిట్టుల జన్మఁజూచి ॥ బ ॥ 44

సీ॥ చౌషష్టివిద్యలఁజదువుదానినిఁగాంచి వాసికెక్కినవాఁడు పండితుండు
వేదాంతసూత్రంబువిరివియింతనిపోయి పలుకనేర్చినవాడు పండితుండు
హేయశరీరముచెరిగిభ్రాంతినివీడి బ్రతుకనేర్చినవాఁడు పండితుండు
సర్వభూతములకుసాక్షినేననివిని భయభక్తిమనువాఁడు పండితుండు
ప్రజ్ఞ చేరెంటివిడువాఁడు పండితుండు
పరమశాంతస్వభావుండె పండితుండు
బాగుఁదెలసినవాఁడెపో బ్రాహ్మణుండు ॥ బ ॥ 45

సీ॥ సంగరంబునఁజావస్వర్గమేయనమరిఁ గాశిలోఁజచ్చినఁగలుగుసుఖము
ఉత్తరాయణమునందుత్తమంబేయనఁ శుక్లపక్షమునందుఁ జూడుసుఖము
పగటిపూటచావు బంగారుచావైన, నంజురోగముచేత నమ్ముసుఖము
ఏకాదశీమృతి యిన్నిటఘనమైన నిధిమీదమరణంబు నిత్యసుఖము
సోమవారమీయన్నిటఁ జూడసుఖము
అంతకంటెను నాయాస మధికసుఖము
నిద్రనుండియె చావనిన్నిటను సుఖము ॥ బ ॥ 46

సీ॥ కూలివానిపంయినిఁగోపంబుఁజేసియుఁ దగ్గుమానికఁగొల్చుధాతయొకఁడు
మణుగునింతనిచెప్పి మాయగాదనియని తక్కువకూచెడు ధాతయొకఁడు
మూరయింతనిపల్కిమూల్యమింతని తెల్పి తక్కువనిచ్చెడు ధాతయొకఁడు
వడ్డివడ్డీకిఁజేర్చి వచ్చునేడాదికి తక్కువవ్రాయించు ధాతయొకఁడు
దయనువిడనాడి తిట్టెడు ధాతయొకఁడు
ధర్మమేజయమనికొట్టు ధాతయొకఁడు
ధరణిసృష్టించె నీకిట్లయ ధాతయొకఁడు॥ బ॥ 47

సీ॥ మొన్నఁజూచినవారునిన్నఁబోయినవారు నున్నవారందుకే యున్నవారు
మొన్నన వ్వేడివారు నిన్న నేడ్చెడివారు నున్నవారందుకే యున్నవారు
మొన్నఁజేయనివారు నిన్నఁజేసినవారు నున్నవారందుకే యున్నవారు
మొన్నఁజదువనివా ర్నిన్నఁజదివినవా రున్నవారందుకే యున్నవారు
చిన్నవారలుపెద్దలై యున్నవారు
కన్నవారలు సవతులఁజన్నవారు
నున్నమాటలకేమని యున్నవారు ॥ బ॥ 48

సీ॥ నవమాసములుమోసినాబిడ్డఁడనియెంతొ తాల్మితోఁబెంచినతల్లియొక తె
యన్నకుభార్యయై యటుపైనవచ్చియుఁ దాల్మితోఁబెంచినతల్లియొక తె
కన్యనుఁగనిమంచి కరుణతోనిడికడుఁ దాల్మితోఁబెంచిన తల్లియొక తె
రాజ్యమేలఁగలట్టి రాజునకుసతియై తాల్మితోఁబెంచిన తల్లియొక తె
తాల్మిఁబెంచిన గురుసతి తల్లియొక తె
ధర్మమందునఁ బరకాంత తల్లియొక తె
దల్లులనెద నీరందరి తల్లియొక తె ॥ బ॥ 49

సీ॥ కటికిచీకటిలోన మటుమాయగా జాన పొట్టనింపుటకునై పుట్టినేను
సుతులపైనాసచే సతమునల్లాడితిఁ బొట్టనింపుటకునై పుట్టినేను
ధనమంచునెప్పుడుఁ గననైతిసత్యముఁ బొట్టనింపుటకునై పుట్టినేను
పొలముపొలమ్మని కలువరింపుచుఁబాడు పొట్టనింపుటకునై పుట్టినేను
బర్రెబర్రెయంచేడ్చితి జుట్టనేను
నిల్లుఁయిల్లనినమ్మితిఁ జెల్లనేను
నెల్లవిధములఁజూచినఁ జెల్లనేను ॥ బ॥ 50

సీ॥ కులమెక్కుడనిమాకు గోత్రంబుఁగలదని గర్వించుచుందురుగానికొంత
రూపంబుఁగలదని రోగంబులేదని గర్వించుచుందురు గానికొంత
ధనముమాకెనని ధర్మంబుఁగాదని గర్వించుచుందురు గానికొంత
అంగనావ్యామోహ మతిపహితంబని గర్వించుచుందురు గానికొంత
తగనివిద్యామదమ్మునఁ దగిలికొంత
రాజ్యసంబంధమయిన గర్వమునఁగొంత
తపముశీలము మాకని తలతురంత ॥ బ॥ 51

సీ॥ తోలుబొమ్మకుఁజూడఁదొంబదితత్వమ్ములున్న వాచనికొందరూఁగుచుండ
ముప్పదిపైనారు మురికిబొమ్మకుఁదత్వ సమితినాఁగొందరుచాటుచుండ
నిరువదిపై నేట నీశరీరంబాయఁ గాయంచుఁగొందరుఁ గనుచునుండ
నిరువదారునకుఁబై నెక్కువలేవు తత్వములంచుఁగొందరుఁ దలఁగుచుండ
బంచవింశతియని వేరఁ బలుకుచుండ
నెంచనిరువది మూడని యెసఁగుచుండ
వ్రాపెరైదనికొందరు వ్రాయకుండ ॥ బ ॥ 52

సీ॥ మంచివారినిఁజూచిమంచివారందుము మనముమంచిగనుండమదికిఁగాదు
చెడ్డవారినిఁజూచి చెడ్డవారందుము మనము చెడ్డనువీడ మదికిఁగాదు
ఒకనితప్పులఁబట్టి యెత్తుచుందుముఁగాని మనముతప్పులమాన మదికిఁగాదు
పరులసొమ్మునుఁజూచిపంచమందుముగానిమనసొమ్ములఁ బంచమదికిఁగాదు
చెప్పుటలు తేలికయెగాని చేయఁగాదు
కానిపనిఁబూను కెన్నఁడు ఘనముగాదు
తూలిపల్కుట లేటికిఁ దోవలేదు ॥ బ ॥ 53

సీ॥ కారణగురుపాద కమలముల్ శిరమందు సమబుద్ధిఁదాల్చని జన్మజన్మె
అతిథివేళకువచ్చి యన్నమ్మడుగఁగా క్షమముమైఁబెట్టని జన్మజన్మె
భగవంతునేవేళ భజియింపకనుఃబాషు సంసృతివిడువని జన్మజన్మె
శరణంబుసీవని శరణుఁజేసినసమ్మి సొంతముఁజేయని జన్మజన్మె
సాధువులఁగొట్టితిట్టెడి జన్మజన్మె
సత్యమాడకఁదప్పిన జన్మజన్మె
శాంతమింతైనలేనిది జన్మజన్మె ॥ బ ॥ 54

సీ॥ పరులకునుపకార మరలేకఁజేసిన దినమెలెక్కకువచ్చు దినముదినము
వ్యక్తిదూషణమానిభక్తిమెచరియించుదినమెలెక్కకువచ్చుదినముదినము
మాతాపితరులకుఁబ్రీతితోమ్రొక్కిన దినమెలెక్కకువచ్చు దినముదినము
ధర్మంబుఁదప్పని కర్మంబుఁనొనరించు దినమెలెక్కకువచ్చు దినముదినము
మనసుబోసీక నిల్పిన దినమెదినమె
వినినమాట జపించెడి దినమెదినమె
జననమరణము లేనట్టి దినమెదినము ॥ బ ॥ 55

సీ॥ అగచాట్లపాలిది యెగతాళిగాదని కష్టసమయమున దృష్టిఁబల్కు
నరజన్మసాటియే మరుజన్మమనుచును సంతసంబుననుండి యింతఁబల్కు
జేసినపనిబహు వాసిగానుండిన నాదెబ్బఁగనుమని యూదిబల్కు
దానుజెప్పినమాటమానుగాఁగాకున్న భగవంతుదయయనివగనుఁబల్కు
జానెఁడేపొట్టకెన్నియో యూనిపల్కు
దన్నుఁదానెర్గు కయఁజిక్కి సన్నుఁబల్కు
సున్నఁగానింతఁజూచిన విన్నఁబల్కు ॥ బ ॥ 56

సీ॥ రాత్రివేళనుఁద్రావు ధాత్రిపైబడియుండఁ గానకఁ బామను వానిపగిది
దారుప్రక్క జీకటిఁ బారఁజూడకఁజోరుఁ డనిభయమూనెడి మనుజుపగిది
నెండమావులనీర ముంచుసంచనిపోయి తిరిగివేసారెడి నరునిపగిది
గలనుఁదోచినయాస్తి కలనుఁబోయిననెంతో పరితాపమొందెడుపురుషుపగిది
చెరనుఁగాంతగ వచ్చెడి పురుషుపగిది
బొట్టనింపెడుగారడి కట్టుపగిది
దిక్కుఁబుట్టించి యురికించు టక్కుజగతి ॥ బ ॥ 57

సీ॥ సాగినప్పుడెయంటు సాగనప్పుడుకంటు పత్తనంబులనంటు పడవకంటు
ధూమశకటమునందునసంటు బడియంటు కాలినడకకంటు కదలనంటు
నీటియంత్రములంటు నిమ్నజాతులకంటు కూటిబసలకంటు కుక్కకంటు
తిరునాళ్లలోనంటు దివ్యగంగకునంటు జట్టులకంటు కంబడులకంటు
దిగుడుబావులకంటు రాతిగుడికంటు
యింటిలోపల నడచిన నింటికంటు
కష్టములువచ్చినప్పుడెక్కడిదియంటు ॥ బ ॥ 58

సీ॥ ముట్టులోపలఁబుట్టి ముట్టులోపలఁబెర్గి ముట్టుదినమ్ములు ముట్టలేము
యోనియందునవచ్చి యోనియందునభ్రాంతి వీలులేనప్పుడువిడువలేము
చండాలుఁడంచును సరిగరానీయము చండాలముననుండి చనఁగలేము
బొంకుపాపమటంచు బోధించుచుందుముమనముబొంకులుబొంకమాన [లేము
చేరిదొంగకుబుద్ధులు చెప్పగలము
దూర్జారుల నోకరీతిఁ దోలఁగలేము
మాటఁజెప్పినయట్టుల మనఁగలేము ॥ బ ॥ 59

సీ॥ వ్యక్తిపోయిన వెన్క వట్టిదేయిదియంత మట్టికేనని దేని మానలేదు
బిడ్డన్ముఁగను వేళఁ బెనిమిటినేస్తంబు వలదనితరువాత వదలలేదు
సత్పురాణపఠన సమయమై రాగ్యమ్ము కొంపఁజేరువరకుఁగూడ లేదు
పిడికెఁడుభిక్షంబుఁ బెట్టలేక గృహంబు విడచిపోయెదమని విడువలేదు
కటకటాయిది చెడుగని కానలేదు
పండలేదని యూరకఁ బండలేదు
ఓర్పుతోనుండవలెనని యుండలేదు ॥ బ ॥ 60

సీ॥ సేయుటయొకరు కాఁజేయుటయొక్కరు వేయుటయొకరు వేంచేయుటొకరు
పెంపారుటొకరిది యింపారుటొక్కరు సంతానమొకరిది చింతకొకరు
మెచ్చువారొకరు పేరెచ్చువారొక్కరు వచ్చుటయొక్కరు చచ్చుటొకరు
వ్రాయుటొక్కరుఁదినవ్రాయువారొక్కరు పట్టువారొకరు చేపట్టుటొకరు
కనినవారొకరను మానమునకు నొకరు
ఉన్నవారొకరేమి లేకున్నదొకరు
నింతచెప్పటమాటకే వింతకొకరు ॥ బ ॥

సీ॥ వారణాశికిఁజని భవునిసంసేవించి ముక్తికై గంగలో మునిఁగిమునిఁగి
గయవచ్చిజ్ఞాతులకర్మపిండముఁబెట్టిముక్తియంచచ్చటమునిఁగిమునిఁగి [నిఁగి
బహుప్రయాసఁబ్రయాగవచ్చితీర్థముఁబట్టిమోక్షమంచుఁద్రివేణిమునిఁగిము
దక్షిణగంగనాఁ దనరుగోదావరిఁ మోక్షేచ్ఛనచ్చోట మునిఁగిమునిఁగి
మరియుచునుఁ గృష్ణవేణిలో మునిఁగిమునిఁగి
పుష్కరంబుల నన్నిట మునిఁగిమునిఁగి
భూరిసేతువనుకమున్గి భువివిసిఁగితి ॥ బ ॥ 62

సీ॥ పంచరంగులమేడనుంచనాభ్రాంత్యని పాలుమాలకనీవు మేలుకొనుము
బంగారుసొమ్ములు సింగారమాయెనే గోలయిు కేటికి మేలుకొనుము
నవరత్నములకాంతిఁజివరకాసింపకఁగాలమానముఁగాంచి మేలుకొనుము
పశుపత్నిసుతగృహవశముఁగాఁబోవక నేలయీతలయని మేలుకొనుము
కాలకింకరుల్ వత్తురు మేలుకొనుము
ఫాలభాగముఁజూడక మేలుకొనుము
చాలుచాలునునిద్దుర మేలుకొనుము ॥ బ॥ 63

సీ॥ పరద్రవ్యమంటకఁ బాపభీతినిఁగని ప్రేమఁజూపినవాఁడె పెద్దవాఁడు
పాడిఁదప్పనితీర్పు పరమధర్మంబని బీదలఁగనువాఁడె పెద్దవాఁడు
పరకాంతతల్లిగఁ బల్కరించినఁ బల్కి పెక్కులాఁడనివాఁడె పెద్దవాఁడు
నాదినీదియటంచు నమ్మించితరువాత వేరుబోవనివాఁడె పెద్దవాఁడు
విశ్వమెఱిఁగినవాఁడెపో పెద్దవాఁడు
విషయహింసలఁ విడువాఁడె పెద్దవాఁడు
లోపమనియెంచి ప్రకృతికి లోనుగాఁడు ॥ బ ॥ 64

పెండ్లిపెండ్లియటంచుఁ బేరంటమనియంచుఁ గొంపలమ్మెడువారుకొంతమంది
బ్రహ్మచారులమంచుఁ బరమవిజ్ఞులమంచుఁ గొంపలమ్మనివారుకొంతమంది
బ్రతుకుపైనాసచే బాకీలొనర్చియేఁ గొంపనిల్పిడువారు కొంతమంది
కల్లుసారాల్ద్రావి కానివారలఁగూడి కొంపఁగూల్చెడువారు కొంతమంది
కొంపలోకొంపలనువారు కొంతమంది
కొంప పాడుగాననువారు కొంతమంది
కొంపకు ననర్థమనువారు కొంతమంది ॥ బ ॥ 65

సీ॥ చేయుపనినేతిగ్గి చేయుచుంటిమిగాని క్రొత్తపనికిఁ మొదలెత్తఁగలమె?
తినెడియన్నమెమరితినుచునుంటిమిగానిసదయనింకొకయన్నముఁదినఁగలమె
కట్టినవస్త్రమే కట్టుచుంటిమిగాని రంగుమార్చుట లెరుగంగఁగలమె?
పెట్టినవిత్తునే పెట్టుచుంటిమిగాని క్రొత్తవిత్తువెదకి విత్తఁగలమె?
లోనికసవునునూడ్చఁగా నూసఁగలమె?
పడతినిన్నటిది యయ్యని విడువఁగలమె?
వింతగాఁబల్కుచుండుట లంతబలమె ॥ బ ॥ 66

సీ॥ ఆర్యసంఘముఁజేరి హరినామకీర్తన మాచరించుచునుండి నదియదినము
భక్తసంతతిఁగూడి పార్వతీపతిధ్యాన మాచరించుచునుండినదియదినము
క్రైస్తవసభఁ కేగిఘనునేసునికిఁ బూజ లాచరించుచునుండినదియదినము
బౌద్ధజనులఁగాంచి పరహింసవిడిసేవ లాచరించుచునుండి నదియదినము
యాంఖుదా ప్రోవరాయను నదియదినము
దీనశుభమెష్టు శేదను దినముదినము
దినమనినఁగర్మ చనుట తద్దినముకనుము॥ బ ॥ 67

సీ॥ బ్రహ్మసంఘముఁ జేరి పరమాత్ముఁ డొక్కఁడే మనకనువాఁడెపో మనుజవరుఁడు
ఘనమైనసభ కేగి కరుణఁ బ్రజ్ఞాసేన మంచిదఁ వాఁడెపో మనుజవరుఁడు
నియతసంఘముఁ గాంచి నియతివ్రాతను వ్రాసిమరలనీఁ వాఁడెపో మనుజవరుఁడు
హింసఁ జేయక నొక్క యిష్టదేవతఁ గొల్చి భక్తిమన్వాఁడెపో మనుజవరుఁడు
మహిమఁ దెలసిన వాఁడెపో మనుజవరుఁడు
మత్తుఁ ద్రాగని వాఁడెపో మనుజవరుఁడు
మైలయంటని వాఁడెపో మనుజవరుఁడు ॥ బ ॥ 68

సీ॥ పని లేక బోరుగింటఁ బాదంబుఁ బెట్టకఁ బతిసేవ మనినదే వనితవనిత
అతిథి వాకిటనిల్చి యన్నమమ్మాయన్న భక్తితో విన్నదే వనితవనిత
కష్టమే తెంచినఁ గటకటఁ బడఁబోకఁ వరశక్తినున్నదే వనితవనిత
పెద్దలఁ బొడఁగన్నఁ బేర్మి నెదురేగి వందనమన్నదే వనిత[illegible]
పరపురుషు నెఱుఁగకున్నదే వనితవనిత
వాసి రెండిండ్లఁ గన్నదే వనితవనిత
వాదులాడకనున్నదే వనిత గురుత ॥ బ ॥ 69

సీ॥ చేయెత్తి దానంబుఁ జేసినవారిదే బ్రదికినవారిలో బ్రదుకుబ్రదుకు
సర్వంబుఁ దనఁగాను సమబుద్ధిఁ జూచిన వారిదే బ్రదికిన బ్రదుకుబ్రదుకు
కామాదిగుణములఁ గదలకుండఁగఁ బట్టి బ్రదికినవారిదే బ్రతుకుబ్రతుకు
సాధుసాంగత్యంబు సతతంబు వీడకఁ బరగినవారిదే బ్రదుకుబ్రదుకు
ప్రాణముల్ నిల్వవనువారి బ్రదుకె బ్రదుకు
పాతకంబు లొనర్పని బ్రదుకె బ్రదుకు
ప్రజలు కొట్టినఁ దిట్టినఁ బ్రదుకుబ్రదుకు ॥ బ ॥ 70

సీ॥ సత్ప్రవర్తనయుండ సభఁ జేయవలయు నాయంత వైరాగ్యమాయ నెడిమాట
ధర్మమ్ము నడుగఁ గాఁ దరువాతఁ జూతము వ్రాయుచేటికనిపోఁ బలుకుమాట
గురువుగా వలయు నాగుణముకు దురుటకై యదిడంబమని తూలనాఁడుమాట
శ్రీరామభజనమ్ముఁ జేరి చేయవలెనా యుంటఁ దగదయను నీసుమాట
అన్నమడిగినమరల రమ్మన్నమాట
యేమి చేసిన నేమి యంచెన్నుమాట
సూటిగాదని నేననుచున్నమాట ॥ బ ॥ 71

సీ॥ ఘోరసంసారాబ్ధిఁ గొట్టుకొని వచ్చి ముందుఁ గానక సుంతమునిఁగి మునిఁగి
పెండ్లాముపిల్లలన్ బెక్కు తామరకలఁ జిక్కులోనొకకొంత చిక్కి చిక్కి
ధనమనుతరఁగలు దబదబలాడుచుఁ బుఱ్ఱుకొనఁగఁదాకఁగ ముక్కి ముక్కి
ఆశయన్ మొసలుల త్యాశతోఁ బట్టరా భీతిమైయెంతయో వెక్కి వెక్కి
పైఁబడఁగఁగాల సర్పము ప్రాకి ప్రాకి
యంధకారమునన్ బాచి యణఁగియణఁగి
పోవుచుండఁగఁ జూచితిఁ బొంగిపొంగి ॥ బ ॥ 72

సీ॥ పతియెదైవంబని భావంబు సందెంతొ సమ్మియున్నదె మంచి నాతినాతి
పతియూర లేకున్నఁ బైపై మెరుంగుల నటియింపకున్నదే నాతినాతి
పతికన్నముందుగ ఫలములేన్ భక్షింప నాయనియున్నదే నాతినాతి
పతికి శుశ్రూషలు భక్తి జేయుచునొక్క నాలుకతోనున్నదే నాతినాతి
నాథు నెడఁబాయకున్నదే నాతినాతి
నమ్మి యుపవాసమున్నదే నాతినాతి
నక్కజిత్తులు లేనిదే నాతినాతి ॥ బ ॥ 73

సీ॥ ప్రాణంబు నిజమని బహుకష్టమొందెదు కనుము మాయ నిజమది కాదుకాదు
కనకంబు నీకెంతొ ఘనమని చూచెదు కనుఁగొన్న స్థిరమది కాదుకాదు
పిల్లలుఁ బెండ్లాముఁ బెల్లముంచె న్నెదు గరళంబదియరుచి కాదుకాదు
గృహభూనిధానమ్ము లింపనియెంచెదు కటకటా సుఖమది కాదుకాదు
కంటికాసులు నందమే కాదుకాదు
కర్మదాయాది చుట్టాలె కాదుకాదు
కనుపడిన రాయి దేవుఁడే కాదుకాదు ॥ బ ॥ 74

సీ॥ సనకాదిమాహేంద్రసంఘంబునకుఁ జూడ నాదిమార్గంబైన దదియునదియె
శుకశౌనకజనక సుమతిబృందములకు నాధారమైనదియదియు నదియె
బ్రహ్మాదిదేవతల్ పరికించఁగా ముందు నంతుఁ దెలియకున్న దదియునదియె
ముమ్మూర్తులమూలంబునకు మూలమై నెగడిన యట్టిదదియునదియె
సూర్యచంద్రులు కనరాకఁ జూచునదియె
కాలకాలంబునన్ జిర కాలమదియె
పుట్టుగిట్టులు లేకయున్న బోనిదదియె ॥ బ ॥ 75

సీ॥ శుక్లశోణితములు జోడుగా నండమై పెరుగఁగఁ దరువాతఁ బిండమాయె
బిండమై పుట్టియుఁ బేరేమి లేకయు నాడుచుఁదానె బ్రహ్మాండమాయె
దరువాత నేనని తగిలి మాయనుఁబడి కానకఁబోవుటఁ గాయమాయె
దిరిగి పెండ్లామని తెచ్చి గీమున నుంప మోహంబధికమాట మోసమాయె
మరలబిడ్డలు ధనమని మానదాయె
గోడువవారలచేఁ దిట్లుఁ గొట్లునాయె
గానకు మృత్యువు చేతిలోఁ గోలుపోయె ॥ బ ॥ 76

సీ॥ మాటలూరకఁ జెప్పమాటల పోతంత్రముని గఁ గూర్చున్న మూకునిఁ గఁ గండ్రు
దండిగా భుజించుపఁ దిండిపోతనియంద్రు తక్కువభుజియించ బక్కటంద్రు
సోకు వేసము వేయఁ బోకిరియనియంద్రు బాగులేకున్నను జోగులంద్రు
తీరనిపనిఁ జేయఁ గోరికఁగలదండ్రు పనిఁ జేయకున్నను వనితయంద్రు
అన్నమడుగనివానికి సన్నమంద్రు
అన్నమడిగినవానికి సున్నయంద్రు
బూటకమ్ములి కేటికీ మాటవిండ్రు ॥ బ ॥ 77

సీ॥ పుట్టలోఁ జెదలుగాఁ బుట్టిచచ్చుటగాని పుట్టుటేమని మతి పుట్టలేదు
చెట్టుమీఁదనుఁ బక్షి యట్టెలేచుటగాని లేచుటేమని యుక్తి తోచలేదు
గిజిగానివలెఁ గూడు సృజియించుటేగాని కూడుటేమని వాంఛ గూడలేదు
ఎద్దు మ్రింగినయట్లు ముద్దమ్రింగుటగాని మ్రింగుటేమని వెదుకంగలేదు
ఆలుపోలునులేదు యే జోలికాదు
చాలుమూలయుఁగాదు యేగోలలేదు
డబ్బు తబ్బిబ్బుఁ జేయు నీదెబ్బరాదు ॥ బ ॥ 78

సీ॥ ఆనందవార్ధిలో హాయిగా మనువాఁడు సంసారవార్ధిని స్నాతుఁడగున
పరమాత్ము భజియించి ఫలమునందెడువాడు చెట్టుకాయలఁ జూడఁ జేరఁ జనున
శ్రీరామనామంబుఁ జేతఁ బెట్టెడువాఁడు కందిపుల్లల బొట్టుఁ గడుపనగున
ఓంకారనాదంబు నొక్కటవినువాఁడు వేరుగంటలనాదు వినఁగనగున
ముక్తికాంతఁగవయువాఁడు మురియఁగనున
జ్ఞానియైనట్టివాడు నజ్ఞానియగున
దారిఁజనువాఁడొకఁడు వేడదారిఁ జనున ॥ బ ॥ 79

సీ॥ చచ్చుచుండినవారుచచ్చుచునుండిరి బ్రదుకుచుండినవారుబ్రతుకుచుండ
దినుచునుండెడివారు తినుచునేయుండిరి తినకనుండెడివారు తినకనుండ
నవ్వుచుండెడివారు నవ్వుచునుండిరి నవ్వకుండినవారు నవ్వకుండ
గనుచునుండెడివారుఁ గనుచునేయుండిరి కనకనుండినవారు కనకనుండ
జేయువారలెల్లప్పుడుఁ జేయుచుండ
మిగులువారలెల్లప్పుడు మిగులుచుండఁ
బిల్లిపట్టినకోడినాఁ జెల్లెనిండ ॥ బ ॥ 80

సీ॥ గురువుపాదముఁబట్టి గుర్తెరింగినవారు తమలోనివైరంబు తగ్గవలయు
శ్రీరామభజనయే చేయునౌననువారు సత్సహవాసంబు సల్పవలయు
సంసారముల్ జేయు చక్కనెగ్గినవారు యజ్ఞపంచకముఁ జేయంగవలయు
బ్రహ్మచర్యవ్రతప్రతిభఁగాం చెడువారుయెవరేని జననిగ భావింపవలయు
దేశభక్తికిరాట్నంబు ద్రిప్పవలయు
గరుణగల్గిన ఖద్దరే కట్టవలయు
దేవుఁగనవున్న సన్నియుఁ దీరవలయు ॥ బ ॥ 81

సీ॥ మోక్షమార్గమునకై మోహంబువిడచినయార్యులఁజేరుఁడీయయ్యలార
వైకుంఠపదవికై వనజాక్షుమరినమ్మి భక్తులఁగూడుడీ భవ్యులార
కైలాససిద్ధికై కరకంఠుమదిఁగొల్చి నసుజుల నరయుఁడీ యన్నలార
స్వర్గసంప్రాప్తికై సాధుపూజలొనర్చి పురుషులఁగలయుఁడీముఖ్యులార
అన్యసుఖములఁగోర రాదయ్యలార
శమనలోకమనినదె సంసారులార
అన్నిలోకమ్ములఁగను ననఘులార ॥ బ ॥ 82

సీ॥ భర్తయేగురువుగ భావించిమదిలోన నానందమొందుడో యమ్మలార
ఆచార్యవర్యుని యాజ్ఞ వాంఛించిన నాచరణగ్రహించుఁడక్కలార
పనిలేకయేతల వాకిటనిలమీకుఁ దగదమ్మ తగదమ్మ తరుణులార
పురుషుఁడొక్కండుండఁబోరాదుమీకటఁబనియెంతయుండినఁబణతులార
పరునిఁగనినవ్వఁ బోకుఁడీ వనితలార
పాపపుణ్యము లరయుఁడీ పడఁతులార
ధర్మమేజయ మూసుడీ తల్లులార ॥ బ ॥ 83

సీ॥ గొప్పమేడలఁగట్టుకొనిసై నగనువారు మాటలో భిక్షులై బ్రమ్మగుటాయె
బడకకుర్చీలపైఁబండి మురియువారు పలుగురాసేలలఁబండుటాయె
గాలికిఁబంకాలు గట్టించుకొనువారు మరుభూమిగాలిలో మసలుటాయె
బంగారుటుయ్యాలపైనిఁనూగెడువారు యుత్తమంచముఁగుక్కినుండుటాయె
వెన్నెలకు వెనుక చీకటి వేగుటాయె
మంచి సెబ్బర సెబ్బర మంచిదాయె
వాడలే బండ్లు బండ్లె వాడలాయె ॥ బ ॥ 84

సీ॥ మునతాతతండ్రులేమరకఁగన్న రెప్పనాఁగాంచుచుండఁగబో మొగడియలోన
రాజాధిరాజులై రాజ్యమంతయు నేలియున్నారలేవారలుర్విలోన
గన్నులుమూసి మెరుకవిధానఁగూర్చున్న వారానులై పోలేదెమాటలోన
నవింతసాధువులు సన్యాసులు స్వాములుఁ జెప్పకఁబోవ రీచిటికలోన
మనముస్థిరమెప్పుగాదుగా మనసులోన
జూఁడుఁడీకసై నమంచిదా చూపులోన
జన్మరాహిత్యమాటకీజన్మలోన ॥ బ ॥ 85

సీ॥ వాలుగువాక్యముల్ నమ్మికఁ జదివిన నియతిబ్రహ్మమునైతి నేననంగ
నీవునీలోఁ జూడఁ నీవు బ్రహ్మంబని పెద్దలునాలా కెవినఁగఁగనఁగ
జూఁడఁజూఁడఁగ నేమి చోద్యంబుఁగానకఁ జూచినవారు పోఁజూడఁగనఁగ
ఈయాత్మయే బ్రహ్మ మిక నేల బ్రదుకని చచ్చినవారింకఁ జాలునవఁగ
పాడిదప్పుట గలదయా బ్రహ్మకనఁగ
జేరికులముబలము రెండు జీవుఁడనఁగ
నెటులఁబోయెనో లేఁడు పాతేలనంగ ॥ బ ॥ 86

సీ॥ నల్ల తెల్లని రొల్లక ల్లెల్లఁజల్లఁగానాయువర్ణ వృక్షంబునాయుఁగొఱకు
గాలిసర్పముతిగ్గ చాలుఁగానంధరిఁ బోరుంధ్రభ్రమింగుచు ఘోరదలకు
నాశయుర్ణ నెదురొగ మూర్తించిత లకెక్క మూలకంబునరించుఁదీరువలకు
గోవిధమురశత్రువుబాధనుగలిగించికొంకుఁనూల్చునుపాదెకంపులకొరకు
వాసనాదోషమాపోదు కాముకొరకు
వచ్చుమదమను యేనుగు చచ్చువరకు
మోహమర్ణ గుక్కకరచునీ కేషిాకడకు ॥ బ ॥ 87

సీ॥ హరిమా దేవుఁడటంచు నరయుదమంటిమా వైకుంఠమున లక్ష్మి వలచినాఁడు
కైలాసపతి యొ శ్రీకంఠుఁడటందుమా యతనికిద్దఱుసతులౌటఁగాడు
బ్రహ్మదేవునిఁబరబ్రహ్మమటందుమా పీతాంబరుని బొడ్డు బిడ్డవాఁడు
దేవేంద్రుఁడే దేవదేవుఁడటందుమా పదినూర్ల యోనుల బంటుకాఁడు
గణపతిఁ దేవుఁడనఁ బెద్దకడుపువాఁడు
యేనె బ్రహ్మమనియనఁగ నెవఁడుఁగాఁడు
సూదికొనమోపలేకున్న చోటుఁజూఁడు ॥ బ ॥ 88

సీ॥ కలలోనఁగాంచిన కాంచనంబును లేచి లీలఁగాఁగనఁజాడ లేనియట్టు
ముత్యపుఁజిప్పనా మురియుచుఁజూచిన రజితంబుతిరువాళ రానియట్టు
గుంటెకొమ్ముకుఁ గోరి వెదకుచుండ దానఁజూచిన లేకఁ దనరునట్టు
లాకాశపుష్పము నెంచుచుండఁ బేరునుఁబోల్చిచూడఁగ లేక పోయినట్టు
వంధ్యసుతుఁగన్నటుల్ కల వచ్చినట్టు
నాతిమాటనుఁగట్టినా నమ్మినట్టు
జూడఁజూడఁగ జగమంత చూరుకట్టు ॥ బ ॥ 89

సీ॥ తలిదండ్రిమాటనుఁదప్పకవిమఁవాఁడె కులభూషణుండైన కొడుకు కొడుకు
కొడుకునకు నిజంబు కోరి చెప్పినవారె ధరణిలో నిజమైన తల్లిదండ్రి
పతియాజ్ఞ కెపుడులోఁబడియుండివిసుఁగక సంసారమున్న దేసతియుసతియు
బరకాంతఁదల్లిగా భావించి సతికెప్డు బరమసుఖంబిచ్చు పతియుబతియు
గ్రిమముఁదప్పకఁబాలించు రాజురాజు
పాడిపీడకనడచెడి ప్రజలుప్రజలు
సత్తుఁజిత్తులెరుఁగనిదే జన్మజన్మ ॥ బ ॥ 90

సీ॥ హిమగిరిప్రాంతాల హైమైనయజ్ఞముల్ తూగి చేసినమహత్తునృపుఁడేడి
పర్జన్యు మెప్పించి పసిడివానను గాంచి హోమముల్ చేయుసుహోత్రుఁడేడి
యశ్వమేధములచ్చి యర్థులఁబూజించి నవరత్నములొసంగు నంగుఁడేడి
తోడుతీర్థులఁగూడ నేకమ్ముగా వెలి సిరియతిథులదను శిబియు నేడి
తల్లిమాటకుఁ దానోడి తల్లి వేడి
వనమునకుఁబోయి వానరవరులఁగూడి
రావణాసురుఁజంపిన రాముఁడేడి ॥ బ ॥ 91

సీ॥ ఆకాశగంగను యాచించిభూమిపై నుంచుభగీరథుం డున్నవాఁడె
పాకశత్రునవచ్చి ప్రార్థింపనశ్వంబు నొసగినట్టిదిలీపుఁడున్నవాఁడె
యుదయాద్రిదనస్తాద్రిసెక్కగట్టుగనేల నుంచినమాంధాత యున్నవాఁడె
కొడుకునడిగికోర్కెఁ గొన్నాళ్ళువయసునుసనుండఁ గనుయయాతియున్న
యొక్కనాఁడు నృపులనెల్ల నొకడుఁగాడె (వాఁడె
తొల్లిరణమునందుఁబారఁగఁ దోలివాఁడె
యుంకనేయుంబకీష్ముండు నున్నవాఁడె ॥ బ ॥ 92

సీ॥ బహుభార్యలనుఁగూడిబహుసంతతినివేడిపడసినశశిబిందు బ్రదుకుఁగలదె
బంగారువేదికబహుయజ్ఞములుజేసిఫలముఁగన్న గయుని బ్రదుకుఁగలదె
అన్నదానంబర్థులకు దానముఁజేయు వరరంతిదేవుని బ్రదుకుఁగలదె
కణ్వాశ్రమంబునఁ గణ్వనిదయఁజేరి రాజైనభరతుని బ్రదుకుఁగలదె
రసమొదవుఁజేయు పృథురాజు బ్రదుకుఁగలదె
పరశురాముని నిజమైన బ్రదుకుఁగలదె
శాశ్వతమొకండుమంచని చాటవలదె ॥ బ ॥ 93

సీ॥ మార్కొన్నయమునొంచుమార్కండుఁడిప్పుడుపనిఁగొనివెదకినమనకురాఁడు
భక్తశిఖామణి ముక్తిమార్గవిదుండు తిరమతిఁబ్రహ్లాదుఁడరిగినాఁడు
శ్రీరామునాజ్ఞచే వారాశిదాటిన వాయుపుత్రుండెటో పోయినాఁడు
హరిజేరిభక్తుఁడై వరలంకఁగైకొన్న ఘనవిభీషణుఁడెందుఁగనఁరాఁడు
పూనియాద్రోణిఁ బరికింపఁగానరాఁడు
గానస్థిరజీవులేయిట్టులైననాఁడు
తుక్కమనము బిసాదను లెక్కఁజూడు ॥ బ ॥ 94

సీ॥ కొడుకులుకోడండ్రు కొట్టితిట్టకమున్నె బాగుగఁదలతెల్ల బడకమున్నె
కాళ్ళఁజేతులఁబుష్టిక్రమముదప్పకమున్నె పండ్లుమొత్తంబూడిపడకమున్నె
కనుచూపుచనికట్లు కరముఁజేరకమున్నె గడగడదలయూపఁబడకమున్నె
నరములుబిగఁదన్ని నడుమునొంచకమున్నె పలుకులుతడిబిడిపడకమున్నె
వినినమాటను మఱిమఱి వినకమున్నె
బొత్తుగాజ్ఞాపకముతప్పి పోకమున్నె
నిజగురుప్రఁజేరియుండు మన్నిటికివన్నె ॥ బ ॥ 95

సీ॥ ఆశనుఁగోసి కామాదిశత్రులఁద్రోసి గుణములఁదెగటార్చు గురుఁడుగురుఁడు
గురురాయపాదముల్ కోరిహృత్సీమనంకితధృతినిల్పు గురుతుగురుతు
ఎనిమిదిపూలచే నెఱిఁగి సద్భక్తిమై పురహరుఁబూజించు పూజపూజ
సర్వభూతములందు సమబుద్ధిఁజూపుచు సూనంబు మానుట మంచిమంచి
తెలిసి మత్తునవదలుటే తెల్వితెల్వి
భువినసత్యంబు మానుట బుద్ధిబుద్ధి
జన్మలేదని మెలఁగుటే జన్మముజన్మము ॥ బ ॥ 96

సీ॥ అన్నిటిఁదెలిసెడియాత్మపోవుటె మోక్ష పదవియంచందురు భాగవతులు
జ్ఞానస్వరూపమే చాల నాత్మనుమానువదలు మోక్షమటంద్రు భాగవతులు
పాషాణసదృశమై పరిబలు నాత్మనెఱింగినవారలు మోక్షమటంద్రు భాగవతులు
జీవుఁడవిద్యనుఁ జేరకుండుటె మోక్ష మనియందురు భాగవతులు
భవహరము మోక్షమందురు భాగవతులు
పరమమే మోక్షమందురు భాగవతులు
భ్రమవిడుటె మోక్షమందురు భాగవతులు ॥ బ ॥ 97

సీ॥ ఉత్పత్తి బట్టబైలేమి లేదనిచెప్పి గురుమొసంగినసూక్తి గుర్తునెఱిఁగి
మూలము లేకనిమూలమున్మెనసు శరీరము కల్లయనుకీలు నెఱిఁగి
నిలుకడ మదేహాక్రియన్మరి లేకట్టు మనశరీరములనుమాట నెఱిఁగి
భోగ్యతిని యాతంబును పరిమోక్షముఁగాంచి పలసముమానెడిశక్తి నెఱిఁగి
మట్టిబంగారునొకటిగ మదిని నెఱిఁగి
సుఖముదుఃఖముసమముగఁ జూడ నెఱిఁగి
ఖరము సర్వంబునొకటిగాఁ గడకు నెఱుఁగ ॥ బ ॥ 98

సీ॥ పుట్టమగిట్టమట్టిట్టనకొట్టిమ బట్టబైలెయుండుపట్టరాదు
సత్తుచిత్తులుగాదు యెత్తువంపులబోదు మొత్తమంతటనుంట నెత్తరాదు
నిగమపద్ధతిఁగాదు జగతియంతడఁబోదు పగలురాతిరియని నెగడరాదు
చూడఁజూడఁగఁగాదు వాడవాడలలేదు యేడఁజూచినఁదోడెతోడరాదు
విద్దియయవిద్యగాదది గిద్దెగాదు
వాడిగలసూదికొనమోపఁ జూడరాదు
నాదినీదియను నెరుక కాదుకాదు॥ బ ॥ 99

సీ॥ ఉదయాస్తమయములునొక్కనాఁడై యుండుబ్రహ్మమారునటంచుఁబల
[కుటాయె
నటువంటిబ్రహ్మలత్యంతంబుఁబోవ శ్రీవిష్ణుఁడొక్కఁడునాఁగవినుటయాయె
నటువంటివిష్ణులనంతమ్ముఁబోవఁగాఁ గరకంఠుఁడొకఁడనఁగాఁ బల్కుటాయె
నటువంటికరకంఠులందరుమారుగ శివుఁడుశాశ్వతుఁడని చెప్పుటాయె
సృష్టికర్తలయీరీతి నేగుటాయె
గాలిఁబీల్చెడితిత్తి నాఁగఁగనాయె
వ్రాసినదెవ్రాసిమఱియుదె వ్రాయుటాయె ॥ బ ॥ 100

సీ॥ కోట్లుసంపాదించికొంపఁబెద్దఁగఁజేసి మరలఁబోయెడిపోరమంగళంబు
మాటమాటకునొకమాటనుఁగల్పించు మాయావినీకిదేమంగళంబు
పెంటిపోతువుగాక బెంటిపోతుప్రసై మహిమనేలెడిప్రభూమంగళంబు
కోటలఁజేటలఁగోసాకివెలసిన మాయయ్యనీకిదేమంగళంబు
మంచిసుఖమిచ్చునీశ్వరా మంగళంబు
మదినిదయఁజూడుపరమేశ మంగళంబు
మఱచిపోఁగాలనీస్వామిమంగళంబు
బట్టబయలొక్క కొప్ప వట్టిమాయ 101

(శ్రీ)

వట్టిమాయశతకము సర్వము

శ్రీ హరిప్రాజ్ఞున కంకితముగా సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ